# మంగళ గౌరీ వ్రతము

## ఆచమనమ్

1. ఓం కేశవాయ స్వాహా 2. ఓం నారాయణాయ స్వాహా 3. ఓం మాధవాయ స్వాహా అని మూడు పర్యాయములు ఆచమనము చేయవలెను.

4. ఓం గోవిందాయ నమః అనుకొనుచూ చేయి కడుగుకొనవలెను.

5. ఓం విష్ణవేనమః కన్నులను తడిచేతితో తుడుచుకొనవలెను.

6 ఓం మధుసూదనాయ నమః
7 ఓం త్రివిక్రమాయ నమః
8 ఓం వామనాయ నమః
9 ఓం శ్రీధరాయ నమః
10 ఓం హృషీకేశాయ నమః
11 ఓం పద్మనాభాయ నమః
12 ఓం దామోదరాయ నమః
13 ఓం సంకర్షణాయ నమః
14 ఓం వాసుదేవాయ నమః
15 ఓం ప్రద్యుమ్నాయ నమః
16 ఓం అనిరుద్దాయ నమః
17 ఓం పురుషోత్తమాయ నమః
18 ఓం అధోక్షజాయ నమః
19 ఓం నారసింహాయ నమః
20 ఓం అచ్యుతాయ నమః
21 ఓం జనార్ధనాయ నమః
22 ఓం ఉపేంద్రాయ నమః
23 ఓం హరయే:
24 ఓం శ్రీకృష్ణాయ నమః

ఈ నామములను మనసారా భక్తితో వుచ్చరించుచు సర్వవిధ మంగళము లను, ఆనందములను కలుగ జేయవలసినది. అని భగవానుడు శ్రీ మహావిష్ణువును ప్రార్ధించుకొనవలెను.

## మంగళోచ్చారణమ్

శ్రీమహా గణాధిపతయే నమః ।
శ్రీలక్ష్మీనారాయణాభ్యాం నమః ।
వాణీహిరణ్యగర్భాభ్యాంనమః ।
శ్రీ ఉమామహేశ్వరాభ్యాం నమః ।
శచీపురందరాభ్యాం నమః ।
అరుంధతీ వసిష్ఠాభ్యాం నమః ।
కులదేవతాభ్యో నమః ।
మాతా పితృ చరణ కమలేభ్యో నమః ।
పతి చరణారవిందాభ్యాం నమః ।
సర్వేభ్యో దేవేభ్యో బ్రాహ్మణేభ్యో నమః ।

నిర్విఘ్నమస్తు పుణ్యాహం దీర్ఘ మాయురస్తు.

శ్లో॥ సర్వేషారంభ కార్యేషు త్రయః స్త్రిభువనేశ్వరాః
దేవాదిశంతు తత్సిద్ధి బ్ర హ్మేశాన జనార్దనా : ॥

## ఇతి సంప్రార్థ్య

విష్ణుర్విష్ణుర్విష్ణుః ఇతి సంస్మృత్య, పంచాశత్కోటి విస్తీర్ణ మహీమండలే జంబూద్వీపే భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైల స్యేశాన్య దిగ్భాగే గంగా గోదావర్యోర్మధ్యప్రదేశే శుభేశోభనే (స్వ) గృహే సమస్త దేవతా గో బ్రాహ్మణ హరిహర చరణ సన్నిథౌ శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే, శ్వేతవరాహకల్పే అష్టావింశతితమే కలియుగే, ప్రథమపాదే, వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ... సంవత్సరే ... ఆయనే... ఋతౌ ... మాసే ... పక్షే ... తిథౌ ... వాసరే ... శుభ నక్షత్రే, శుభయోగే శుభకరణే శ్రీమతః ... గోత్రస్య ... శర్మణః ధర్మపత్నీ శ్రీమతిః ... గోత్రవతీ ... నామధేయవతీ, అహం మమోపాత్త దురితక్షయద్వారా యావజ్జీవసౌమాంగల్య సిద్ధ్యర్థం మమ - వివాహ ప్రథమవర్షాది పంచమవర్ష పర్యంతం శ్రీమంగళగౌరీ వ్రతం కరిష్యే । అద్య శ్రీమంగళ గౌరీ దేవతా ప్రీత్యర్థం సంభవద్భిర్ద్రవ్యైః సంభవితానియమేన ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే - (అని సంకల్పమొనర్చి నీటిని విడువవలెను.)

## కలశపూజ

తదంగ కలశారాధనం కరిష్యే - కలశం శుద్ధోదకై గంధ పుష్పాక్షతైరభ్య ర్చ్య - పరిశుద్ధమైన నీరు నింపిన కలశమును గంధముతోడను, పుష్పముతోడను, అక్షతలతోను పూజించవలెను. అనంతరము కుడిచేతి వ్రేళ్లతో కలశమందలి జలమును తాకుచు అప్పుడు యీ క్రింది శ్లోకములను శ్రద్ధగా పఠించ వలయును.

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః
మూలే తత్రస్థితోబ్రహ్మా మధ్యే మాతృ గణాస్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యధర్వణః ॥
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥
గంగేచ యమునేకృష్ణే గోదావరి సరస్వతీ
నర్మదా సింధు కావేరీ జలేస్మిన్సన్నిధిం కురు ॥
ఆయాంతు శ్రీమంగళగౌరీ పూజార్థం
మమ దురితక్షయ కారకాః
కలశోదకేన పూజా ద్రవ్యాణి, దేవి, మాత్మానంచ సంప్రోక్ష్య

ఈవిధముగా చదివి కలశాంతర్గత జలమును పూజా ద్రవ్యములపై జల్లి, తరువాత తనయొక్క తలపై జల్లుకొనవలయును. అనంతరము పసుపుతోగాని, స్వర్ణముతోగాని సిద్దము చేసుకొనిన గౌరీదేవిపై కలశోదకమును చల్లుట చేయవలెను.

## ప్రాణప్రతిష్ఠా మంత్రః

ఆ హ్రీం క్రోం యం రం లం వం శం షం హం సః శ్రీమంగళ గౌరీ దేవతా స్థిరాభవతు సుప్రసన్నా భవతు వరదాభవతు - అనుచు గౌరీదేవిని ప్రతిష్టించి యీ క్రింద విధముగా జెప్పుచు నమస్కరించుకొనవలెను.

## దీప దేవతాభ్యో నమః

శ్లో॥ దీపస్త్వం బ్రహ్మ రూపోసి జ్యోతిషాం ప్రభురవ్యయః
సౌభాగ్యం దేహిపుత్రంచ సర్వాన్ కామాంశ్చ దేహిమే ॥

దీపదేవతాభ్యో నమః అని ఆ జ్యోతిని పువ్వులతో పూజించవలెను. తరువాత పరిశుద్ధ హృదయముతో పుష్పములు తీసుకొని మొక్కుచు శ్రీ మంగళగౌరీ దేవినీ ఈవిధముగా ధ్యానించవలెను.

## ధ్యానం

శ్లో॥ సకుంకుమ విలేపనా మళికచుంబి కస్తూరికాం
స మందహసి తేక్షణాం సశరచాప పాశాంకుశాం
ఆశేషజన మోహినీం అరుణమాల్య భూషాంబరాం
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ ॥

అని వినుతించి శ్రీ మంగళ గౌరీదేవికి సింహాసనము నొసంగి పువ్వుల నుంచవలెను.

## ఆవాహనము

శ్లో॥ ఆగచ్ఛ సర్వ దేవేశి సర్వకార్యార్ధ సిద్ధయే
సర్వసిద్ధిప్రదే దేవీ సర్వపాప ప్రణాశినీ ॥

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః ఆవాహనం సమర్పయామి.

## ఆసనం

శ్లో॥ కల్లోలోల్లసి తామృతాబ్దిలహరీ మధ్యే విరాజ న్మణి
ద్వీపే కల్పక వాటికా పరివృతే కాదంబవా ట్యుజ్వలే
రత్న స్తంభ సహస్రనిర్మిత సభామధ్యే విమానోత్తమే
చింతారత్న వినిర్మితం జనని తే సింహాసనం భావయే ॥

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః నవరత్న ఖచిత సింహాసనం సమర్పయామి.

## పాద్య సమర్పణ

శ్లో॥ గంగాది సలిలైర్యుక్త స్సుగంధాగురు వాసితం
పాద్యం గృహాణ సుశ్రోణి రుద్రపత్నీ నమోస్తుతే ॥

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః పాద్యం సమర్పయామి కలశజలమును పుష్పముతో చల్లవలెను.

## అర్ఘ్య సమర్పణ

శ్లో॥ భాగీరథ్యాది సలిలం నానాతీర్థ సమన్వితం
కర్పూరగంధసంయుక్తం అర్ఘ్యంతుభ్యందదామ్యహమ్ ॥

హ్రీం శ్రీంమంగళగౌర్యై నమః అర్ఘ్యంసమర్పయామి అని కలశ జలమును పుష్పముతో చల్లవలెను.

## ఆచమనమ్

హ్రీం శ్రీం మంగళ గౌర్యై నమః ఆచమనమ్ సమర్పయామి.

అని కలశములోని జలమును, దేవి ఆచమనమును చేయుట కనుకొని, పుష్పముతో అందించవలెను.

## మధుపర్క సమర్పణ

శ్లో॥ స్వర్ణపాత్రై స్సమానీతం దధిఖండ మధుప్లుతం
మధుపర్కం గ్రహాణేదం మయాదత్తం సురేశ్వరీ ॥

హ్రీం శ్రీం మంగళ గౌర్యై నమః మధుపర్కం సమర్పయామి - మధుపర్కము సమర్పించవలెను.

## పంచామృత సమర్పణ

శ్లో॥ క్షీరం దధ్యాజ్య మధురా శర్కరా ఫలసంయుతం
స్నానం స్వీకురు దేవేశి సృష్టి స్థిత్యంతరూపిణీ ॥

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః పంచామృతస్నానమ్ సమర్పయామి.

## స్నానము

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః - శుద్ధోదకస్నానం సమర్పయామి అని పువ్వుతో నీరు చల్లవలెను.

## వస్త్ర సమర్పణం

శ్లో॥ సర్వదే సర్వదా గౌరీ సర్వాభరణ భూషితే
పీతాంబరద్వయమిదం గృహాణ పరమేశ్వరీ ॥

ముందుగా - హ్రీం శ్రీం మంగళ గౌర్యైనమః కంచుకమ్ సమర్పయామి అని రవికె, వస్త్రము మున్నగునవి సమర్పించి - పిదప - హ్రీం శ్రీం మంగళ గౌర్యైనమః - ఉత్తరీయం సమర్పయామి - అనుకుని - ఉత్తరీయమును సమర్పించి పువ్వులు చల్లి నమస్కరించవలెను.

## గంధం సమర్పణ

శ్లో॥ గంధ మనోహరం దివ్యం ఘనసార సమన్వితం
తుభ్యం భవానిదాస్యామి చోత్తమం చానులేపనమ్ ॥

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః గంధంసమర్పయామి - చల్లనితల్లి గౌరిపై గంధమును చిందించవలెను.

## అక్షతా సమర్పణ

శ్లో॥ అక్షతాన్ శుభవర్ణాభాన్ హరిద్రాద్యైస్సుసంయుతాన్
కాత్యాయినీ గృహాణత్వం సర్వదేవ నమస్కృతే ॥

హ్రీం శ్రీ మంగళగౌర్యై నమః అక్షతాన్ సమర్పయామి

## పుష్ప సమర్పణ

శ్లో॥ చంపకాశోక కల్హార కుముదోత్పల జాజిభిః
కరవీరాది కుసుమైః పూజయామి సురేశ్వరీ ॥

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః పుష్పాణి సమర్పయామి. కుసుమ సమాన హృదయయైనగౌరీ దేవిపై పువ్వులనుంచవలెను.

## పుష్పమాలికా సమర్పణ

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః పుష్పమాలికాం సమర్పయామి - అనుకుని గౌరీమాతకు ఒక పూలదండను సమర్పించవలెను.

గీ॥ గౌరీదేవి యనంగ సంసార సాగ
రంబు దాటించునౌక నిజంబు - ఆమె
తనను బూజించు వారిని( బ్రేమను( గనుగొను
చుండు, నామె యెడ నంతయు నిండియుండు.

## అధాంగ పూజా

| | | | |
|---|---|---|---|
| ఉమాయై నమః | పాదౌ పూజయామి | వరప్రదాయై నమః | హస్తౌ పూజయామి |
| గౌర్యై నమః | జంఘే పూజయామి | బ్రహ్మ విద్యాయై నమః | జిహ్వాం పూజయామి |
| పార్వత్యై నమః | జానునీ పూజయామి | శంకర్యై నమః | ముఖం పూజయామి |
| జగన్మాత్రే నమః | ఊరూం పూజయామి | శివాయైనమః | నేత్రౌ పూజయామి |
| జగత్ప్రతిష్ఠాయై నమః | కటిం పూజయామి | రుద్రాణ్యై నమః | కర్ణౌ పూజయామి |
| మూలప్రకృత్యై నమః | నాభిం పూజయామి | సర్వమంగళాయై నమః | లలాటం పూజయామి |
| అంబికాయై నమః | ఉదరం పూజయామి | సర్వైశ్వర్యకర్యై నమః | వక్త్రం పూజయామి |
| అన్నపూర్ణాయై నమః | స్తనౌ పూజయామి | హ్రీం శ్రీం మంగళగౌరీ దేవతాయై నమః: | సర్వాణ్యంగాని పూజయామి. |
| శివసుందర్యై నమః | వక్షం పూజయామి | | |
| మహాబలాయై నమః, | బాహూన్ పూజయామి | | |

అక్షతలను పువ్వులను జల్లుచు తల్లి మంగళగౌరీ దేవిని పూజించుచుండవలెను.

గీ॥ సజ్జనుల బ్రోచు తల్లిరో శక్తికొలది
పూజ సేయంగ హర్షించి పుణ్య మొసగు
మంగళప్రదగౌరి నమస్సులమ్మ
నీవు చల్లగ మమ్ములబ్రోవు మమ్మ ॥

## శ్రీ గౌరీ అష్టోత్తర శత నామావళి

(ప్రతి నామమునకు ముందు "ఓం"ను చివర "నమః"ను చేర్చవలయును)

| | | |
|---|---|---|
| ఓం గౌర్యై నమః | అష్టమూర్త్యాత్మికాయై | పార్వత్యై |
| గణేశజనన్యై | అష్టదారిద్ర్యశమన్యై 10 | పాపనాశిన్యై |
| గుహాంబికాయై | శివాయై | నారాయణాంశజాయై |
| జగన్నేత్రే | శాంభవ్యై | నిత్యాయై 20 |
| గిరితనూభవాయై | శాంకర్యై | నిర్మలాయై |
| వీరభద్రప్రసువే | బాలాయై | అంబికాయై |
| విశ్వవ్యాపిన్యై | భవాన్యై | హిమాద్రిజాయై |
| విశ్వరూపిన్యై | హైమవత్యై | వేదాంతలక్షణాయై |

కర్మబ్రహ్మమయ్యై
గంగాధరకుటుంబిన్యై
మృడాన్యై
మునిసంసేవ్యాయై
మాలిన్యై
మేనకాత్మజాయై 30
కుమార్యై
కన్యకాయై
దుర్గాయై
కలిదోషవిఘాతిన్యై
కాత్యాయన్యై
భద్రదాయిన్యై
మాంగళ్యదాయిన్యై
సర్వమంగళాయై
మంజుభాషిణ్యై
మహేశ్వర్యై 40
మహామాయాయై
మంత్రారాధ్యాయై
మహాబలాయై
సత్యై
సర్వమయ్యై
సౌభాగ్యదాయై
కామకలనాయై
కాంక్షితార్ధప్రదాయై
చంద్రార్కాయుత తాటంకాయై
చిదంబరశరీరిణ్యై 50
శ్రీ చక్రవాసిన్యై
దేవ్యై
కామేశ్వరపత్న్యై
కమలాయై
మురారిప్రియార్ధాంగ్యై
పుత్రపౌత్రవరప్రదాయై
పుణ్యాయై
కృపాపూర్ణాయై
కల్యాణ్యై
కమలాయై 60
అచింత్యాయై
త్రిపురాయై
త్రిగుణాంబికాయై
పురుషార్ధప్రదాయై
సత్యధర్మరతాయై
సర్వరక్షిణ్యై
శశాంకరూపిణ్యై
సరస్వత్యై
విరజాయై
స్వాహాయై 70
స్వధాయై
ప్రత్యంగిరాంబికాయై
ఆర్యాయై
దాక్షాయిణ్యై
దీక్షాయై
సర్వవస్తూత్తమోత్తమాయై
శివాభినామధేయాయై
శ్రీవిద్యాయై
ప్రణవార్ధస్వరూపిణ్యై
హ్రీంకార్యై 80
నాదరూపాయై
సుందర్యై
షోడశాక్షరదీపితాయై
మహాగౌర్యై
శ్యామలాయై
చండ్యై
భగమాలిన్యై
భగళాయై
మాతృకాయై
శూలిన్యై 90
అమలాయై
అన్నపూర్ణాయై
అఖిలాగమసంస్తుతాయై
అంబాయై
భానుకోటిసముద్యతాయై
వరాయై
శీతాంశుకృతశేఖరాయై
సర్వకాలసుమంగళ్యై
సోమశేఖర్యై
అమరసంసేవ్యాయై 100
అమృతైశ్వర్యై
సుఖసచ్చిత్సుధాసారాయై
బాల్యారాధితభూతిదాయై
హిరణ్యాయై
సూక్ష్మాయై
హరిద్రాకుంకుమారాధ్యాయై
సర్వభోగప్రదాయై
మార్కండేయవరప్రదాయై
నమః 108

* * *

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి

## ధూపం

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః ధూప మాఘ్రాపయామి అని సాంబ్రాణి ధూపము వేయవలెను.

## దీపం

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః దీపం దర్శయామి - దీపమును వెలిగించి గౌరీదేవికి చూపవలెను.

## నైవేద్యం

శ్లో॥ హ్రీంకారేశ్వరి తప్తహాటకకృతే స్థాలీ సహస్రైర్భృతం
దివ్యాన్నామృత సూపశాకభరితం చిత్రాన్న భేదంతథా ।
అన్నం మధుశర్కరాదధియుతం మాణిక్యపాత్రేస్థితమ్
మాషాపూపసహస్రకంచ సఫలంనైవేద్యమావేదయేత్ ॥

హ్రీం శ్రీం శ్రీ మంగళగౌర్యై నమః మహా నైవేద్యం సమర్ప యామి- అని చదువుచు కలశాంతర్గత జలమును తన కుడిదిక్కుగా చల్లు కొనవలెను. అనంతరము ఏయే పదార్థములు నైవేద్యము పెట్టుచుంటిమో ఆయా పదార్థములపై కలశము నందలి నీరు నొక పువ్వుతో చల్లవలెను. వానిచుట్టూ "అమృతమస్తు" అనుచు కలశోద కమును చల్లవలెను. "అమృతోపస్తరణమసి" అని శ్రీ మంగళగౌరీ దేవికి సమర్పించ వలెను.

ఓం ప్రాణాయస్వాహా - అపానాయస్వాహా - వ్యానాయస్వాహా - ఉదానాయ స్వాహా - సమానాయస్వాహా అని చెప్పికొనుచూ - కుడిచేతిలో ఒకపువ్వునుంచుకుని, కుడి మోచేతికి ఎడమచేతి వ్రేళ్లనానించి శ్రీ మంగళగౌరీ దేవికి నైవేద్యముగా అయిదుసార్లు చూపవలెను.

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి.

## నైవేద్యానంతర ఉపచారములు

హస్తౌప్రక్షాళయామి (అని రెండుసార్లు) పాదౌప్రక్షాళయామి (అని రెండుసార్లు) శుద్ధాచమనీయం సమర్పయామి (అని ఒకసారి) మొత్తం అయిదుసార్లు ఒక పువ్వుతో ఉదకము జల్లవలెను.

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః ముఖమండనార్థం తాంబూలం సమర్పయామి - అని అనుచు వివిధ సుగంధ ద్రవ్య పరిమళ సంయుతమైన తాంబూలమును శ్రీ మంగళగౌరీ చెంత నుంచవలెను.

హ్రీం శ్రీం మంగళగౌర్యై నమః ఆనంద నీరాజనం సమర్పయామి- అని అనుచు హారతి వెలిగించి గౌరీ దేవికి చూపించుచు, మంగళహారతి పాడవలెను.

## మంగళ హారతి

చల్లని చూపులతో ఎల్లవారల బ్రోచు మంగళగౌరికి జయమంగళం
ఎల్లవేళల బ్రోచు ఉల్లముగల అమ్మ మంగళగౌరికి శ్రీమంగళం
శ్రద్ధతో పూజించి భక్తితో ప్రార్థించ వెంటనే దయచూపు దేవి మా అంబికకు॥జయ॥
వృద్ధులూ, పిన్నలూ అందరూ హృదయాల ధ్యానించు గౌరికి ॥జయ॥
సర్వశోకమ్ములూ సర్వవిధ బాధలూ పూజించ తొలగించు మాతల్లి గౌరికీ ॥జయ॥
సర్వవేళలగాని, ఏ వేళలనుగాని పూజించ మేల్జేయు తల్లి మా గౌరికి ॥జయ॥
పాపములనెల్ల పటాపంచలుగ జేయుచూ కరుణనే వర్షించు దయామతల్లికి ॥జయ॥
లోపములు పూజలో ఏపగిది జరిగినా కోపపడనీ తల్లి మంగళగౌరికి ॥జయ॥
హ్రీం శ్రీం శ్రీ మంగళగౌర్యై నమః సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి,

అని పువ్వులు, అక్షతలు, చిల్లరడబ్బులు సమర్పించుకొనవలెను.
హ్రీం శ్రీం శ్రీ మంగళగౌర్యై నమః -
ఛత్రం సమర్పయామి అని పుష్పములు సమర్పించవలెను,
హ్రీం శ్రీం శ్రీమంగళ గౌర్యై నమః -
చామరైర్వీజయామి - అని చామరముతో వీచుట చేయవలెను.
హ్రీ శ్రీం శ్రీ మంగళ గౌర్యై నమః
గీతం శ్రావయామి - అని మధురముగా పాడవలెను.
హ్రీం శ్రీం శ్రీ మంగళగౌర్యై నమః
నానావిధ రాజోపచారాన్, దేవ్యోపచారాన్ - సమర్పయామి.
అని కొన్ని పువ్వులను దేవిచెంత నుంచవలెను.

## ఆత్మ ప్రదక్షిణ నమస్కారాదీన్

"యానికానిచపాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే"
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాంకృపయాదేవీ శరణాగత వత్సలా ॥

"అన్యథాశరణంనాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్ కారుణ్య భావేన శ్రీ గౌరీ రక్షమాం సదా"

అని ముమ్మారు ప్రదక్షిణించి - అమ్మవారికి నమస్కరించుకొనవలెను.

హ్రీం శ్రీం శ్రీ మంగళగౌర్యై నమః నమస్కారాన్ సమర్పయామి.

అని తల్లిని మనస్సున ధ్యానించుకొనుచు నమస్కారము నొనరించవలెను. పిదప -

## క్షమాపణం

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరీ
తత్సర్వం క్షమ్యతాందేవి కాత్యాయిని నమోస్తుతే ॥

సర్వం శ్రీ మంగళగౌరీ దేవతార్పణమస్తు ॥ అనయా మయాకృత పూజయాచ శ్రీ మంగళగౌరీ దేవతా సుప్రసన్నా వరదా భవతు ॥

అని జలాక్షతలు విడచుట చేయవలెను.

## వాయనం

తరువాత బెల్లము, శనగలు, రవికెల గుడ్డలు, పువ్వులు, పండ్లు, తగు దక్షిణ మొదలగువానితో నింపబడిన వెదురుబుట్టవంటి దానిని బ్రాహ్మణునకు భక్తిశ్రద్ధలతో దానమీయవలెను. అనంతరం - ముందుగా గౌరీదేవికి నివేదించిన శనగలు మొదలైనవానిని గ్రహించి -

శ్లో॥ "కాత్యాయినీ శివా గౌరీ సావిత్రీ సర్వమంగళా
సువాసనీభ్యోదాస్యామి వాయనాని ప్రసీదతు"

అని అనుచు ముత్తదువులకు, తన మాతృదేవతకును వాయనముల నీయవలయును. అనంతరము 16 వత్తులు గల ఆవు నేతి దీపాలు వెలుగజేసి, కథ వినవలెను. కాటుక ధరించి దేవీ ప్రసాదమగు పూవును తలయందును, కుంకుమను నుదుటను ధరించవలెను.

శ్రీమంగళగౌరీ పూజా విధానము సంపూర్ణము.

# శ్రీ మంగళ గౌరీదేవి వ్రతకథ

తొల్లి సూతులవారు శౌనకాది మహర్షుల చెవులకు విందుగ వినిపించిన మంగళ గౌరీదేవియొక్క మహాత్మ్యమునూ, పరమభక్తాగ్రేసరుడైన నారద మునీంద్రుడు సావిత్రీ పతివ్రత కుపదేశించిన మంగళగౌరీ వ్రత కథా, పూజా విధానములునూ - ఒకానొక సమయమున ద్రౌపదీ దేవికి శ్రీకృష్ణుడు యీ విధముగ వివరింప దొడంగినాడు.

"ద్రౌపదీ! పరాశక్తియే మంగళగౌరిగా లోకమున ప్రఖ్యాతి గాంచినది, ఆ మంగళగౌరీదేవికి కటాక్షము యే స్త్రీలపై వుండునో వారికి వైధవ్యబాధ కలుగబోదు. సర్వవిధ సౌభాగ్యములతో వారు అలరారగలరు. ఆ మహాదేవిని శ్రద్ధాభక్తులతో అర్చించవలెను. ప్రతి సంవత్సరమూ శ్రావణమాసములో వచ్చు మంగళవారములే ఈ వ్రతము చేయుటకు అర్హములయి యున్నవి.

మంగళ గౌరీదేవి - పసుపు, కుంకుమ, పూలు, సుగంధాది మంగళ ద్రవ్యము లందుననూ - ఆవునేతితో ప్రకాశించుజ్యోతి రూపమునందునూ భాసిల్లుచుండును. మంగళగౌరిని పూజించి సౌభాగ్యవంతులయిన పావనులయిన స్త్రీ లెందరో కలరు.

పూర్వకాలమునాటి మాట యేమిటనగా, త్రిపురాసురులను సంహరించుటకు వెడలిన ఆ ఈశ్వరుడు, ఈ గౌరీదేవిని పూజించియే విజయ పతాక మెగురవేసినాడు. ఆమెను పూజించుట వలననే కుజుడు, మంగళ వారమునకు తాను అధిపతి కాగలుగుట జరిగినది. మనువంశజుడైన "మండు"డను రాజు గౌరీదేవి తపః ప్రభావముననే చాలాకాలము భూలోకమున సర్వసంపదలతో రాజ్యమేల గలిగినాడు.

గౌరీదేవిని పూజించి వైధవ్యమును తప్పించుకొనిన అదృష్టవంతురాలయిన ఒక నారీమణి కథ చెప్పగలవాడను వినుము.

చాలాకాలము క్రిందట జయపాలుడనెడి రాజు మాహిష్మతీ నగరమును పాలించుచుండెడివాడు. అతనికి సంతానం తప్ప సర్వమూ

వుండెను, దానివలన అతడు సర్వమూ వున్ననూ సర్వమూ లేనట్లే భావించు చుండెను. చేసిన దానములకు, నోచిన నోములకు, మ్రొక్కిన దైవములకు లెక్కయేలేదు. అనేక పుణ్యకార్యముల నొనర్చెను. కాని, అతని కోరిక అప్పటికినీ తీరకుండెను.

చివరకు పరమేశ్వరునకు వారిపై కరుణ కలిగింది. ఒక సన్యాసి రూపంతో అతడు జయపాలుని నగరమునకు వచ్చి అంతఃపురమందలి బయట ద్వారము చెంత నిలువబడే "భవతి భిక్షాందేహి" అని యరచి, క్షణమైననూ నట నిలువక వెడలిపోయెను. జయపాలుని భార్య పళ్లెరమున వస్తువులు సమకూర్చుకొని బయటకు వచ్చు లోపుగానే ఆ సన్యాసి వెడలిపోయెను. ఆవిధముగా మూడు రోజులపాటు జరుగగా జయపాలుని భార్య భర్తకు విషయ మెరిగించినదయ్యెను. భర్త "సతీతిలకమా! అతడు ప్రతిదినము మధ్యాహ్న సమయమున కదా వచ్చు చున్నాడు. రేపు ఆ సమయమునకు ముందుగానే వెడలుము. పిలిచిన వెంటనే ఆ సన్యాసికి భిక్షను వేయుము" అనెను. ఆమె "అట్లే" యనెను.

సన్యాసి వేషధారియైన పరమేశ్వరుడా దినము మధ్యాహ్న సమయ మున వచ్చి భిక్ష నడిగిన వెంటనే ఆమె ముందునకేగి "స్వీకరించు"డని బంగారు పళ్లెర మందీయ నెంచెను. అంతనా సన్యాసి దానిని గ్రహింపక "మీరు పుత్ర పౌత్రులు లేని నిర్భాగ్యు లగుటచే మీ చేతి భిక్షగాని, ఆతిథ్యముగాని మేము స్వీకరించుట అసంభవము" అనెను. "అయిన మహాత్మా! సంతానము గలుగు మార్గము మా కెరిగించి పుణ్యము గట్టుకొను"డని ఆమె అనెను. ఆ సన్యాసి "నారీమణీ! ఇప్పుడు నేను చెప్పబోయేది తు.చ. తప్పక నీభర్త కెరిగింపుము. అప్పుడు పని జరుగును.

నీలవస్త్రధారిగ, ఒంటరిగ, నీలాశ్వారూఢుడై నీమగనిని నగరపు తూర్పు దిక్కునకు వెడలమనుము. అచ్చట అరణ్యంలో అతని నీలాశ్వము యెచ్చట అలసటతో క్రిందబడునో అచట దిగి త్రవ్వమనుము. అక్కడ ఒక బంగారు దేవాలయముండును. అందుగల భవానిని పూజించినచో

ఆమె మిమ్ములను నుద్ధరించును" అని చెప్పి, ఆ సన్యాసిరూపధారియగు పరమేశ్వరుడు వెడలి పోయినాడు. భర్తకు ఆమె అట్లే చెప్పగా నాతడు నట్లేయని వెడలినాడు. సాధువు చెప్పిన ట్లాతడు భవాని దేవాలయమునకేగి సర్వవిధముల భవాని నర్చించెను. జయపాలుని భక్తికిమెచ్చిన దేవి 'వరము నిచ్చెద కోరుకో'మనగా జయపాలుడు సంతానం కావలెననెను. అంతనా తల్లి "వైధవ్యము గల కన్యకావలెనా? అల్పా యుష్మంతుడు, సజ్జనుడగు కొమరుడు కావలెనా?" అని ప్రశ్నించెను. రాజు ఆలోచించి పితరుల నుద్ధరింపగల కొమరునే కోరుకొనెను. అంతట దేవి అతనిని "పార్శ్వమున గల గణపతి నాభియం దడుగువైచి చెంతగల చూతవృక్ష ఫల మొకటి కోసుకొనిపోయి నీ భార్యకి"మ్మని చెప్పి అంతర్ధానమయ్యెను, జయపాలు డంతట ఆ వృక్షమునందలి పండ్లన్నియు కోసికొనగ అన్నియు మాయ మయి ఒక్కటియే వుండెను. అట్లు కోసినందున గణపతి కినిసి "ఈ అకృత్య ఫలముగ నీకు జన్మించు కుమారుడు పదునారవయేటనే సర్పము వలన మరణించు"నని శపించెను. రాజు తన నగరికి మరలినాడు.

ఫల ఫలితముగ జయపాలుని భార్య ఒక కుమారుని కనినది. అన్నియు సక్రమముగ జరిగినవి. తరువాత పిల్లవాడు క్రమంగా పెరగ సాగాడు. వయసు వచ్చినది. జయపాలుని భార్య "అబ్బాయికి వివాహము జరిగిన ఆయుర్దాయము పెరుగును. గనుక వివాహము చేయు"డన 'మన వాడు దైవదర్శనార్థం కాశీకి వెడలవలయును గదా! వెడలి వచ్చిన వెనుక వివాహ విషయ మాలోచించెదము గాక' అనినాడు - జయపాలుడు. త్వరలోనే వారు తమ కుమారుని అతని మేనమామతో కాశీకి పంపిరి. త్రోవలో వారు ప్రతిష్ఠానపురము చేరిరి. అచట వారొక ఆరామమున ప్రవేశించిరి. అక్కడ కొంతమంది కన్యలు ఆడుకొనుచుండిరి. అందు సుశీల అను కన్యను మరొకకన్య దెబ్బలాట సందర్భమున "ముండా-రండా" యని తిట్టెను. అంతట సుశీల "మా అమ్మగారు మంగళగౌరీ వ్రతం చేయుచున్నది. కనుక మా కుటుంబ మున నెవ్వరును ముండలూ రండలూ వుండరు. అటులగుట కాదు" అనెను.

జయపాలుడి కుమారుడు శివుడును, అతని మేనమామయునూ కాంతసేపచ్చుటనే వుండి, తరువాత సుశీల తండ్రి అర్చించు పార్వతీ పరమేశ్వ రాలయమునకు వెడలిరి. అప్పటికక్కడ సుశీల తండ్రి దైవము నకు నమస్కరిం చి, మా సుశీలకు తగిన వరుడెచ్చటనున్నాడని శివుని ప్రశ్నించాడు. మేనమామ, సుశీల తండ్రికి కనిపించకుండ ఆలయం వెనుక తటినుండి "శివుడను పేరుగల ఒక బాటసారి నీకిక్కడనే దొరకగలడు. అతడే నీ కుమార్తెకు తగిన వరు"డని పలికెను. తరువాత సుశీల తండ్రి, శివుడను పేరుగల వరునకిచ్చి తన కుమార్తెకు వివాహము చేయుట జరిగెను. తదుపరి భార్యాభర్తలు క్షారలవణ వర్జ్యముగ భుజించి బ్రహ్మచర్య వ్రతులై దర్భాస్తరణములపై శయనించిరి. ఆరాత్రి మంగళగౌరి ముత్తయి దువ రూపమున సుశీలకు కలలో కనబడి "నీభర్త అల్పా యుష్కుడు. ఈ రాత్రితో అతని ఆయువు మూడినది. ఆ దోషముపోవుట కొకటి చెప్పెదను చేయుము. క్షణముపోయిన వెనుక కృష్ణ సర్పము ఒకటి అతనిని కరచుటకు వచ్చును. నీవు ఒక పాలుగల కుండనుతెచ్చి సర్పమునకెదు ట పెట్టుము. అంత ఆ పాము పాలకయి ఘటమున ప్రవేశించగా, నీవు ఒక వస్త్రముతో దానిపై గట్టిగా వాసెనగట్టుగట్టి ఉదయమున దానిని మీతల్లికి వాయనమిమ్ము. నీభర్త కా గండము దాటు"నానెను.

సుశీల కనులు తెరచెను. గౌరీదేవి చెప్పినటులే జరిగెను. సుశీల యు, గౌరి చెప్పినటులనే పాముగల కుండను వస్త్రముతో కట్టివుంచెను. తరువాత భర్తలేచి, ఆకలి అగుచున్నది. ఏమైనా పెట్టమనగా ఒక పళ్లెమున భక్ష్యములు తెచ్చిపెట్టెను. భక్ష్యములు భుజించి యతడు తన యుంగర మొకదానిని అచ్చట పడవేసెను. తరువాత వారు సుఖముగా నిద్రించిరి. తెల్లవారకముందే శివుడు, సుశీలకు చెప్పకుండగనే, తన మేనమామతో వెడలిపోయెను. సుశీల అతని అంగుళీయకమును భద్రపరుచుకుని సిగ్గుపడింది. తరువాత, శివుడే సాక్షాత్తు శివుని వేషము ధరించి వచ్చెను. అందరు అసలు వరుడనియే అనుకొనిరి. ఉదయాన సుశీల గౌరి చెప్పిన

విధంగా ఘటమును తన తల్లికి వాయనమిచ్చి నది. ఆ ఘటమును తెరచిచూడగా ఒక ముత్యాలహార ముండెను. తల్లి ముత్యాలహారమును సుశీలకిచ్చి - ఆరాత్రి భర్తతో నిద్రపోవుటకు పంపగా గదిలోనున్న మాయా వరుని పసిగట్టిన సుశీల - అతడు తన అసలు భర్తకా-డని నిరాకరించెను. ఇంతలో మాయావరుడంతర్ధాన మొందినాడు, అందరును సుశీల మాటలు నమ్మిరి. ఉంగరము వీడిన అసలు వరుడు మరల కాశీనుండి వచ్చునని, అతనిని గుర్తించుటకు వీలుగా బాటసారులకు తానే స్వయ ముగా అతిధిమర్యాదలు చేయుటకై ఒక మంటపము కట్టించవలెనని సుశీల తన తండ్రిని కోరగా, నాతడట్లొనర్చినాడు. ఆ ఉంగరం ధరించి, సుశీల అతిథులకు అనుదినమూ పాదప్రక్షాళన మొనర్చుచుండును. అచటనుండి ఎప్పుడో వెడలి పోయిన శివుడు, వాని మేనమామ కాశీకేగి తిరిగి స్వప్రాంతమును చేర బయలు దేరిరి. మార్గమధ్యమున శివునకు కలవచ్చినది. అందుతాను చనిపోతున్నట్లున్నూ, అప్పుడు మంగళ గౌరియు, యమదూతలు తన విషయమై యుద్ధమొనర్చు కొనుచున్నట్లు తోచినది. తరువాత వారు మరల ప్రతిష్టానపురమున కేగి అన్న సత్రమున కేగిరి. అట సుశీల శివునికి పాదప్రక్షాళన చేయుచు అతడే తన వరుడని మాతా పితరులకు చెప్పెను. ఆనవాలు ఉంగరం గూర్చి చెప్పినది. శివుడు నిజము చెప్పినాడు. అనంతరము వారికి వివాహమైంది. శివుడు సుశీలతో తన తల్లిదండ్రులను చేరెను. మామ, సుశీలను తన కుమారునకు ఆయుష్షు ఎటుల వృద్ధి అయినదనెను. అది మంగళగౌరి కృప అని చెప్పినది. తరువాత వారు చిరకాలముండిరి. కావున ఓ ద్రౌపదీ! మంగళగౌరీ వ్రతప్రభావమున వైధవ్యము లేకుండ చేసికొనవచ్చును." అని శ్రీకృష్ణుడు చెప్పెను.

* * *

# వ్రత ఉద్యాపనము

ఈ వ్రతం పెండ్లి అయిన సంవత్సరమునుండి ప్రారంభించి అయిదు సంవత్సరాలు చేయవలెను. అయిదవ సంవత్సరమున శ్రావణ మంగళవారమున పగటివేళ మంగళగౌరిని యధావిధిగా పూజించవలెను. దంపతులుపవాసముండ వలెను. రాత్రివేళ మంటపము మున్నగునవి నిర్మించి, అక్కడ 19 కలశములను స్థాపించ వలెను. అందు ఉమామహేశ్వరులను, బ్రహ్మను, విఘ్నేశ్వరుని, స్కంధు ని, శచీపురంద రులను, సప్తమాతృకలనూ, సావిత్రినీ, లక్ష్మీనారాయణులను, సర్వదేవతలనూ, నవగ్రహములనూ పూజించుట చేయవలెను. శక్తి లేనిచో 5 కలశములు చాలును. లేకున్న 2 చాలును. మరునాడు స్నానమొనర్చినవారై బెల్లము, జీలకర్ర, పరమాన్నము, నెయ్యి, రావిసమిధలు, దూర్వాంకురములు- వీనితో హోమము నొనర్చవలెను. "సర్వమంగళ మాంగళ్యే" అను మంత్రమే ప్రధానము. 6 వెదురు పాత్రలను మంగళ ద్రవ్యాలతో సువాసి నీలకు వాయనము లీయవలెను.

పిదప "ఉద్దీప్య" అను మంత్రముతో 15 వత్తుల దీపములు పదహారింటిని వెలిగించవలెను. సువాసినీలను, దంపతులను - భోజన, చందన తాంబూలాది సత్కారములతో పూజించి ఆనందపరచవలెను. ఇది చాలా మహిమగల వ్రతము.

కథా - ఉద్యాపనా విధానములు సంపూర్ణము

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకేదేవి నారాయణి నమోస్తుతే ॥

**అమ్మదయ వుంటే అన్నీ వున్నట్లే**